# అంకితం

★

నెల్లూరుజిల్లా, నెల్లూరు తాలూకాలో యున్న పోట్ల పూడి గ్రామంలో శ్రీ కోడూరు బాలిరెడ్డిగారు జన్మించినారు. వీరిజీవితం ఒక త్యాగపూరితయజ్ఞం. వీరికి ఆదర్శమూర్తి శిబిచక్రవర్తి. ఈ విషయం నా కెన్నోమార్లు ఋజువుచేసేరు. భయంకర రోగబాధిత జనావళికి ఆయన ఒక ఆత్మీయ బంధు జనుడు. తన ఆరోగ్యాన్నిసైతము కాలదన్ని, పూరిగుడిసెల్లో అనారోగ్యంతో ఆక్రందిస్తున్న అభాగ్యుల సేవకే తనజీవితం అంకితంచేసి, ఆసేవలోనే తను కేన్సర్ వ్యాధితో బాధ పడుతూ కన్నుమూసిన అసలైన ప్రజాసేవకుడు.

అట్టి దరిద్రనారాయణులకు తన జీవితాన్ని

అంకితంజేసిన

కీ. శే. కోడూరు బాలిరెడ్డిగార్కి—

యీనా నాటిక

అంకితం.

# అవతారిక

ఈ చిన్ని నాటికకు ప్రస్తావనవంటి యీ అవతారిక వ్రాయమని గ్రంథకర్తలు శ్రీ ఆకుల సుబ్రహ్మణ్యంగారు నన్ను కోరుటచేతనూ, యిందు ప్రతిష్ఠింపఁబడిన కథానాయకుడు శ్రీ అల్లూరు సీతారామరాజు నా విద్యార్థిదినములలో స్నేహితు డగుటచేతను యీ గౌరవము నాకు దక్కినందుకు నేనెంతయో గర్వపడుచున్నాను.

శ్రీ అల్లూరు సీతారామరాజు తునిగ్రామ సమీపములో 1900 సం॥న ఒక పల్లెయందు క్షత్రయకులమునందు జన్మించినారు. వీరు తునిరాజులకు ఆత్మీయ రక్తబంధువులు. ధైర్యసాహసములు వారికి వుగ్గుపాలుతోనే పట్టుబడినవి. స్వాతంత్రేచ్ఛ వారికి ప్రతి రక్తకణములో చెలరేగు చుండును. వారి బాల్యములోనే ఆభావం వేయిముఖాల దర్శన మిచ్చింది. ఆటపోటీలలో, సాముగరిడీలలో ఆరితేరిన మేటి మొనగాడు. వీరు నాతో Bad-minton బహు నేర్పుగా ఆడేవారు. ఈ ఆటలలోనే వీరికి నేను చాలా సన్నిహితం కాగలిగేను. కాకినాడ పి. ఆర్. కాలేజీలో వీరు Intermediate వరకూ చదివేరు. Chemistry వీరికి చాలా యిష్టం.

చదువులు చాలించేడు. వున్న వూరికి స్వస్తిచెప్పేడు. కొండలతో, అడవులతో పరివేష్టితమైయున్న మన్యానికి బయలుదేరినాడు. తన శీలంతో, తన పవిత్రభావాలతో మన్యంమహావీరులను తనవశం చేసుకొన్నాడు. అప్పుడు తన ధ్యేయాన్ని వారి ముందుంచినాడు. అది పవిత్రమైన ధ్యేయం. వారు కాదనలేకపోయినారు. శ్రీ ఆకుల సుబ్రహ్మణ్యంగా రన్నట్లు "గుండెకాత్తురును అడుగడుక్కీ అర్పణచేస్తూ స్వరాజ్యం వచ్చిందాకా పోరాటం సాగిస్తాం" అని అందరూ శపథం తీసుకొన్నారు. స్వాతంత్ర పోరాటం మన్యంలో ప్రారంభమైంది. ప్రభాత భేరీ మ్రోగింది. పరప్రభుత్వపు గుండెలు అదిరినవి. కాకినాడలో 1923 సం॥లో అ. భా. కాం. సభ జరిగింది. ఆనాటి సభలో నేనూ వున్నాను. మహమ్మదాలీ అధ్యక్షుడు. ఒకనాటి సభలో సుభాసుబొసు

మాట్లాడుచుండినాడు. ఒక్కక్షణం గజ్జముమీద సీతారామరాజు ప్రత్యక్షమైనాడు. సందేశం విన్పించేడు. సుభాసుబాబుతో మాట్లాడి నాడు. బ్రిటిష్‌రాక్షసులు పట్టుటకు ప్రయత్నంచేసేరు. అంతలోనే సీతా రామరాజు అదృశ్యమైనాడు. తుదకు ఎన్నోకుట్రలు పన్ని మోసంచేసి 1924 సం॥లో యీ అపరశివాజీని బ్రిటిష్‌ప్రభుత్వం కాల్చి చంపివేసినది. తెనుగుదేశపు విప్లవచరిత్రకు అది ఆఖరు.

అల్లూరు సీతారామరాజుజీవితమే, రచయిత వ్రాసినట్లుగా "నిప్పులు చిందించే ఒక అగ్నిగుండం". వారి జీవితచరిత్రలోని ఘట్టమును శ్రీ అకుల సుబ్రహ్మణ్యంగారు బహుచక్కగా చిత్రించేరు. ఈ వీరుని జీవితం నిప్పులగుండం. ఈ రచయితవచనం కత్తులూ, బాకులూ. అవి మాటలు కావు; పౌరుషాగ్నుల చిందించే బడభాగ్నులు. మన బొబ్బిలినాటకం అనంతరం వీరరసప్రధానమైన నాటకం యిదియే. చక్కటిశైలి, భావ గర్భితమైన భాష, రక్తాన్ని వుప్పొంగించే పదజాలం, హృదయాన్ని గగుర్పొడిపించే సంఘటనలు. ఈ నాటికను చదువుతూంటే నాకు అల్లూరు సీతారామరాజుగారు దర్శనమిచ్చినట్లుండినది. నూటికి నూరు పాళ్లు ఆంధ్రపౌరుషమును, స్వాతంత్ర్యేచ్ఛను, పరిపూర్ణ దేశభక్తినిచాటు మహోత్తరనాటిక యీ సీతారామరాజునాటిక. ఈ మహావీరుని జీవిత గాథను ఫిల్ముతీస్తే ఎంతో బాగుంటుందికదా! లేక యీ నాటికనైనా ఏ ఫిల్ములోనైనా సందర్భానుసారంగా ప్రదర్శిస్తే యింకా బాగుంటుంది!

భాషను తనకైవసం చేసుకొన్న యీ కవి యింకాయింకా అనేక నాటకాలను వ్రాసి తెనుగులోకానికి చక్కటి నాటకాలులేని కొఱతను తీరుస్తారని నే నాశిస్తూ యీ రచయితను హృదయపూర్వకముగా ఆశీర్వ దిస్తున్నాను.

నెల్లూరు,
10—9—58.

ఇట్లు,
డైరెక్టరు కొల్లకూరి సదాశివరావు.

# భావనాతరంగం

ప్రపంచ చరిత్రలో ఒకనాటి విప్లవకణం ఒక క్రొత్తఆశను, బానిస దేశాలకు అందించినది. సామ్రాజ్యవాదుల బానిసబంధాల్లో చిక్కుని నలిగిపోతున్న విముక్తి కాంక్షితదేశాలు తలఎత్తి ఆ ఆశాజ్యోతివైపు జూచినవి. ఆ అగ్నికణం, ఆ విప్లవకణం బానిస భారతదేశంనుంచి రగుల్కొంటూ బైలుదేరింది. పరిపూర్ణ దేశభక్తిభావంతో సమస్తము అర్పణచేయుటకు బయలుదేరుతున్న వీరత్యాగి అతను. అతని ఆయుధం ధైర్యంతో గూడిన తనగుండే! జరుగబోయే యజ్ఞంలో అతని అర్ఘ్యం అతనిగుండెల్లో ప్రవహించే వేడిరక్తం! ఆయనే విప్లవమహానాయకుడు శ్రీ అల్లూరు సీతారామరాజు!

కన్నబిడ్డ ప్రతిఒక్కడూ తనతల్లికి సేవచేస్తాడు; ఎక్కడో జయ చంద్రులలాంటి కొంతమంది ద్రోహులుతప్ప! ఒక్కొక్కరు అనుసరించే మార్గం వారిభావనకు అనుగుణ్యంగా వుంటుంది. కన్నబిడ్డ తగలబడుతున్న కొంపలో చిక్కునుంటే, తమబిడ్డను రక్షించమని, కొంతమంది వారినీ వీరినీ ప్రాధేయపడుతుంటారు. అదే కొంతమంది, తమబిడ్డ ఆ పరిస్థితుల్లోనే వుంటే యింక వారి కేమీ కన్పించదు; వేయినాలుకలతో చాచుకొని వస్తున్న ఆ మంటల మధ్యనయుండే తమ బిడ్డతప్ప. ఇక వేరే ఆలోచన తట్టదు. దూకుతుంది; ఆతల్లి ఆ అగ్నిగుండంలోకి దూకుతుంది. చేతనైతే బిడ్డను రక్షించుకొంటుంది. చేతగాకపోతే ఆ బిడ్డతోగూడా తనూ కాలిపోతుంది. ఆకోవకు చెందినవారు శ్రీ అల్లూరు సీతారామరాజు. ఈలాటి మహావీరుల బలిదానమే నేటి మన స్వతంత్ర భారతదేశం.

ఈ విప్లవనాయకుని జీవితం నాటికను వ్రాయడమంటే, రామాయణాన్ని మూడుమాటల్లో వ్రాయడంలాంటిది. కానీ, నన్నీపనికి పురిగొల్పి, నాకు స్ఫూర్తినిచ్చి నాచేత యీ మహాకార్యాన్ని చేయించినది. అనంతపురంజిల్లా రొద్దంగ్రామ కాపురస్థులు నాటి నెల్లూరుజిల్లా హిందూ దేవాదాయ ధర్మాదాయములశాఖ అసిస్టెంట్ కమీషనరు శ్రీ కొత్త

రామకృష్ణప్పగారు. వీరి చల్లటి హృదయాన్ని నే నెన్నటికీ మరువలేను. ఆ పూజ్యమూర్తికి యివే నా నమస్కారములు! ఈ నాటికను మొదటి సారిగా నెల్లూరు ఫ్రెండ్సు యూనియన్ వారిచే శ్రీ శైలనిధి సమర్పణ మహోత్సవ సందర్భములో నెల్లూరు పురమందిరమునందు హిందూదేవాదాయ ధర్మాదాయముల శాఖ ఆంధ్రకమీషనరు పూజ్యశ్రీ పైడి లక్ష్మయ్యగారి అధ్యక్షతన ప్రదర్శించబడినది. ఆనాడు నా నాటికను చూచి, నాభుజము తట్టి నాకు ప్రోత్సాహమిచ్చిన కవివరేణ్యులు, పండితశ్రేష్ఠులు పూజ్యశ్రీ పైడి లక్ష్మయ్యగారికి యివే నా నమస్కారములు! ఆ కళామయ హృదయానికి యిదే నా కృతజ్ఞత!

నాటకరంగానికి కావలసిన మెళకువలను, యింకా అనేక విషయాలను నాకు నేర్పి అల్లూరు సీతారామరాజునాటికను పృథ్వీఆర్ట్ థియేటర్సువారికి డైరెక్టుచేసి యీ నాటికలో రూథర్ ఫర్డుదొరపాత్రను ధరించి, అనేకచోట్ల ప్రదర్శించిన కళాహృదయులు, సహజనటనాధురీణులు నెల్లూరు వాస్తవ్యులు శ్రీ యన్. వి. సుబ్బారావుగారికి జీవితాంతంకూడా నేను ఋణపడియున్నాను! వారికివే నా హృదయపూర్వక నమస్కారములు. ఈ నాటికకు పరిచయవాక్యములు వ్రాసి ఆంధ్రనాటకప్రపంచానికి నన్ను పరిచయంచేసిన డైరెక్టరు శ్రీ కాళ్లకూరి సదాశివరావుగారికి యిదే నా హృదయాంజలి!

నెల్లూరు,<br>10—9—58.

మీ<br>ఆకుల సుబ్రహ్మణ్యం.

మహాజనటనాధురీణ



యన్. వి. యస్. రావు

## మనవి

★

ఈ నాటికకు సంబంధించిన నాటికాప్రదర్శన హక్కులు శ్రీయుత యన్.వి. సుబ్బారావు గారికి చెందియున్నవి. వారి అనుమతితో యీ నాటికను ప్రదర్శించుకొనుటకు యేలాటి అభ్యంతరము లేదు.

---

ఈ నాటికలో వచ్చు పాత్రలు

- సీతారామరాజు
- రామచంద్రరావు
- సింగన్న
- రూథర్
- తల్లి

# అల్లూరు సీతారామరాజు



[ తెరవెనుక శంఖుశబ్దాలు, కొమ్ముశబ్దాలు విన్పిస్తూవుంటవి. కొన్నిక్షణాల్లో ఆశబ్దాలు మెల్లగా నిలచిపోతవి. తెర తొలగిపోతూ వుంటుంది. ]

[అది ఒక అరణ్యప్రదేశం. రంగస్థలమునకు మధ్యగా మట్టిపూడలు భుజములవరకు వచ్చునట్లు వ్రేలాడుతూ వుంటవి. ఈ ఊడలకు వెనుకభాగం వెదురు దిట్టంగా వుంటుంది. ఇరుప్రక్కల కలబంద చెట్లు బొంతజెముడు అక్కడక్కడ వుంటవి. క్రింద పండుఆకులు ఎండుఆకులు చిక్కగా పడివుంటవి. గురివెంద, దొండతీగలు ఎదురుపొదలకు కలబందకు దట్టముగా అల్లుకొనివుంటవి. ఎండి ఒరిగిన కొమ్మ ఒకటి క్రింద పడి వుంటుంది. అది సంధ్యాసమయం. ఆ మెట్టటి కావురంగు ఎదురు పొదలచాటునుంచి వచ్చి రంగస్థలంమీాద వున్నవారిపై పడుతుంది. రంగస్థలంమీాద నడుచుచున్నపుడు క్రింద రాలి వున్న ఆకులు కాళ్ళకు తగిలి పైకి ఎగురుచుండును. సీతారామ రాజు కోపముగా వున్నపుడుగాని, వారి మనస్సులో తీవ్ర భావములు చెలరేగుతున్నపుడుగాని అడ్డముగాయున్న ఆ వూడలను విసురుగా వూపి వదలివేయును. ఆ వూడల నీడలు సీతారామరాజుముఖముమీాద అటుఇటూ పడుచుండును.

అప్పుడప్పుడూ కీచురాళ్ళశబ్దములు విన్పించుచుండగా యీ క్రింది వచనం విన్పిస్తుంది.]

స్వరాజ్యం రాకముందు పరితపించి, పరితపించి, ఆ ఆవేదనతో గుండెలే పెఠిళ్ళున పగిలి రక్తాన్నే పణంగా ధార బోసిన త్యాగధనుడు, తెనుగువీరుడు ఆంధ్రవజ్రం అల్లూరు సీతారామరాజు. కత్తికికత్తి, దెబ్బకుదెబ్బ, రక్తానికిరక్తం అని స్వాతంత్ర్య పోరాటానికి సూత్రంకావాలని భాష్యంచెప్పిన ఆచార్యులు మన అల్లూరు సీతారామరాజు. ఈ సూత్రం తోనే తెల్లదొరల అధికారసింహాసనాన్ని అధోపాతానికి అణగద్రొక్కాలని అణగారిన జాతికి ప్రబోధంచేసిన వీరుడు అల్లూరు సీతారామరాజు. ముక్కోటి తెనుగువీరుల మకుట రాజము అల్లూరు సీతారామరాజు.

అల్లూరు సీతారామరాజుకీ జై! ఆంధ్రప్రజా విప్లవానికి జై! జై! భారతప్రజావిప్లవానికి జై!! జై, ప్రజావిప్లవనాయక అల్లూరు సీతారామరాజుకీ జై!!

[పై నినాదములు విన్పించుచుండగా సీతారామరాజు రామచంద్రరావు ప్రవేశించి యేదోఆలోచనలతో శూన్యంలో చూస్తూవుంటారు. సీతారామరాజుచేతిలో వ్రాడ వుంటుంది. అంబులపొది, బాణము భుజమున వ్రేలాడుతుంటవి. ఒకకాలు ఆ విరిగిన కొమ్మమీద మోపివుంటాడు. క్షణకాలం నిశ్శబ్దం. సీతారామరాజుకు కుడివైపున రామచంద్రరావు నిలబడి వుంటాడు.]

సీతా:- భారతమాత చిరకాల దాస్యబంధాలు తెగిపోవుటకు శపథం తీసుకున్నవీరుడిన్ని తనకత్తినే క్రింద పెట్టమంటారా? రామచంద్రరావుగారూ! మీరూ దేశభక్తులే! మీరిచ్చే పవిత్రమైన సలహా యిదేనా! ముక్కోటి తెనుగుప్రజలు, ముప్పదిమూడుకోట్ల భారతీయులు యీ పైశాచిక తెల్ల కోతుల ప్రభుత్వానికి నిర్దయగా, అమానుషంగా బలిఐపోతున్నారే! వారి విముక్తికోసం యీ హస్తాన్ని అలంకరించిన యీ ఖడ్గాన్నే ముక్కలుముక్కలుగా విరచమంటారా? బాగా ఆలోచించండి.

రామ:- సీతారామరాజుగారూ! ఆవేదన పడకండి! బ్రిటిష్ వారి మాటల్లో నాకూ నమ్మకంలేదు. కానీ రూథర్ ఫర్డు దొర రాజీకి రమ్మంటున్నాడు. రాజీవ్యవహారాలు జరుగబోయేముందు రక్తప్రవాహం అనవసరమేమో!

సీతా:- అఖండ భారతదేశ స్వాతంత్ర్య పోరాటంలో మరణమైనా సహిస్తాగాని, మేకతోలు కప్పుకొన్న మృక్కడి మృగములదగ్గరకు లాలూచీలకు, రాజీలకు నేను రాలేను.

రామ:- సీతారామరాజుగారూ! మన స్వాతంత్ర్యం......

సీతా:- అవును! స్వాతంత్ర్యసమరం వ్యాపారం కాకూడదు. దీనికి మధ్యేమార్గంలేదు. అటు భారతమాత చిరకాల దాస్యబంధాలు వీడిపోవడమో, లేక స్వాతంత్ర్య పోరాటంలో సమస్తము అర్పణ కావడమో తేలిపోవాలి! ఇక దీనికి వేరేమార్గం లేదు.

రామ:- బ్రిటిష్‌వాండ్లే రాజీలకు రమ్మంటున్నారు. కాబట్టి వ్యవహారాలు చక్కబడవచ్చునేమో!

సీతా:- అటు సమస్తప్రజ, అధికార మదాంధపిపాసకు నిర్ద యగా నాశనమౌతూంటే, నేను వారితో రాజీలు జరుప లేను. ఇది ఆత్మద్రోహము. ఇది వీరుడు చెప్పదగ్గ మాట కాదేమో!

రామ:- చెప్పతగ్గమాట కాకపోయినా, యీ రాజీవ్యవ హారాల్లో మనకే న్యాయం కలుగవచ్చునేమో!

సీతా:- రాజ్యకాంక్షాపిపాసతో సముద్రాలకు సముద్రాలనే దాటి సమస్తమును కబళించ పూనుకొన్న సర్వభక్షక పిశాచి మనతో రాజీజరిపి మనకు న్యాయాన్ని కలుగ జేస్తుందంటావా?

రామ:- రాజీమాటలు చెప్పి, రూథర్‌ఫర్డుద్వార మనకు అన్యా యం చేస్తాడంటే నాకుమాత్రం నమ్మకంలేదు. తప్పకుండా మీరు రూథర్‌దొరతో రాజీ వ్యవహారాలు జరుపండి. అప్పుడే అన్నీ శాంతబడతవి.

సీతా:- ఆకలిగొన్న సింహానికి చేతులెత్తి దణ్ణంబెడ్తే దయ చూపి నిన్ను వదలిపెడ్తుందా? నింగికి నిప్పులవర్షం కురిపిస్తూ వున్న అగ్నిపర్వతంపై పన్నీరుపోస్తే అది ఆవిరైపోతుందే కాని ఆ నిప్పులవర్షంమాత్రం నిలచిపోదు.

రామ:- అది నిజమే కాని.........

సీతా:-...రూథర్ న్యాయస్థుడనా మీ వుద్దేశ్యం? అయితే పల నాటి హనుమంతుని రాజీయని రహస్యంగా కుట్రపన్ని చంపడం రూథర్ యొక్క ధర్మబుద్ధే నంటావా?

రామ:- కాదు.

సీతా:- మన్యం మహావీరులను చంపి మానవత్వాన్ని మరచి ఆశవాలమీద గెంతులేసి ఎగరటం రూథర్ యొక్క సున్నితమైన హృదయ మంటావా?

రామ:- ('కాదు' అనునట్లుగా తల అడ్డము వూపును.)

సీతా:- మన్యం మగువలను నగ్నంగా నడివీధిలో త్రిప్పడం రూథర్ యొక్క మానవత్వ మంటావా?

రామ:- కాదు.

సీతా.- గర్భిణీస్త్రీలను, కనుతెరచీ తెరవని చంటిపాపలను కత్తులతో పొడిచి అట్టహాసం చేయడం రూథర్ యొక్క దయార్ద్రహృదయ మంటావా?

రామ:- కాదు! కాదు! నేననను.

సీతా:- కానీ యేమంటావ్?

రామ:- ఏ దేశంలోని ప్రజలు సుఖపడాలని నీవు కత్తిపట్టేవో, ఏ మన్యం ప్రజలకోసం నీ గుండెనెత్తురును అర్పణచేసి శాంతి తోరణం కట్టాలనుకున్నావో, ఏ బానిస దేశం సర్వ స్వాతంత్ర పతాక క్రింద నాట్యమాడాలని వీరకంకణం ధరించేవో, ఏ భారతమాత కాటుక కంటినీరు ధరణీదేవి

గుండెలమీద ప్రవహించకూడదని ప్రతినబూనినావో, ఆ పవిత్రమైన కోర్కెలు సఫలం కావాలంటే. నీ చేతనున్న యీ వీరఖడ్గాన్ని క్రిందకు దింపాలి! తప్పదు!

సీతా:- [రోషంతో ప్రక్కనున్న పూడను పూపివేస్తాడు. దహించుక పోయే హృదయంతో రంగస్థలమంతా అటూ ఇటూ తిరుగుతాడు ] (బిగ్గరగా) రామచంద్రరావ్!...మీ రంటున్న దేమిటి? ప్రచండభీకర సమరం కొనసాగే సమయంలో, దేశభక్తి పేరుతో చేతగాని అహింసాముసుగు ధరించుకొని పిటికి మందును నూరిపోస్తున్నారా? కత్తినిబట్టి కదనరంగంలో తెల్లదొరల కంఠాలను తెగద్రెంచి సమరాగ్నులలో ప్రాణములర్పించిన వందలాది మన్యంవీరులకు ద్రోహం చేయమంటావా? అనేక వేలమంది దేశభక్తులను పొట్ట బెట్టుకొని లక్షోపలక్షల భారతీయులను ఆకలిజ్వాలలతో దగ్ధంచేయు యీ రాక్షసప్రభుత్వంతో రాజీలు జరుప మంటావా? అది నా చేత కాదు! అది ద్రోహం!! పచ్చి ద్రోహం!! అది పచ్చి దేశద్రోహం!!!

రామ:- అది ద్రోహంకాదు. రక్తపుటేరులు ప్రవహించే సమయంలో రాజీమార్గం శాంతితోరణం కడ్తుంది.

సీతా:- కాదు! వీరునికర్తవ్యం పోరాటం నిలపడంకాదు. కాకూడదు. రక్తపుటేరులు పారనీ, రణరంగమందు అశేష వీరులు నేలకొరగనీ, దేశదేశములన్నీ ఏకమై ఎదురు తిరగనీ, భారతమాత దాస్యవిముక్తి జరుగనంతవరకు యీ యుద్ధం ఆగబోదు. నిజమైన భారతీయుని విధి అదు

గడుక్కీ రక్తాన్ని అర్చనగా అర్పణచేస్తూ యీ భీకర సమరం కొనసాగించడమే. ఈ ధర్మయుద్ధం మధ్యలో ఆగేదానికి వీలులేదు...ఇది అనంతపోరాటం.

రామ:- యీ అనంతపోరాటాన్ని...

సీతా:- నిలిపేదానికి వీలులేదు. బందిఖానాల్లో కుళ్ళిపోయే దేశభక్తులకు విముక్తిలేదా? శాంతియుత సమావేశాల్లో తలలు బద్దలౌతుంటే మీ అహింసావాదులకు రక్షణే లేదా?

రామ:- రక్షణ జరగాలి! పరప్రభుత్వం పోవాలి! స్వాతంత్ర్యం కావాలి!

సీతా:- అందుకే యీయుద్ధం జరగాలి! యీ అనంతపోరాటం మధ్యలో ఆగకుండా నిరంతరంగా కొనసాగాలి! స్వాతంత్ర్య వీరుల బలిదానపు మంగళగీతం విన్పించాలి! ఆ మంగళ గీతం విన్పించినదాకా యీ విప్లవాగ్నులు రగులుకుంటూనే వుండాలి. తెనుగుబిడ్డ మొదలుబెట్టిన యేపనీ మధ్యలో ఆగదు. ఏపనిని చేసినా తెనుగోడే చేయాలి! తెనుగుబిడ్డ ప్రారంభించిన యుద్ధాన్ని, కార్యాన్ని సాధించిందాకా మధ్యలో విడువడు.

రామ:-యుద్ధాన్ని ఆపరా?సీతారామరాజుగారూ!యుద్ధాన్ని..

సీతా:- మధ్యలో ఆపేదానికి వీలులేదు. ఈ జ్వాలాజ్వలిత భయంకర సమరాగ్నులలో తెల్లదొరలు ఆహుతికాక మునుపే, యీ యుద్ధం ఆగేదానికి వీలులేదు. అది నీతికి

విరుద్ధం. జాతికి అవమానం! భారతమాత కంఠానికి తడి గుడ్డ బెట్టి గొంతుకోయడం. అమాయక మానవరక్తంతో అంతులేని పిపాసాతుచ్ఛులై కడుపులు నింపుకునే ఈ ముష్కరజాతి సమూలంగా సర్వనాశనం కాకమునుపే యీ వీరుడు పట్టినకత్తిని దింపడు. అంతవరకూ యీ కృపాణానికి విశ్రాంతి లేదు.

రామ:- సీతారామరాజుగారూ! మీరు కత్తిని దింపకపోతే తెల్లదొరల దౌర్జన్యాలకు మన్యంప్రజ మట్టిలో కల్సి పోవల్సిందే. గ్రామాలకు గ్రామాలే దగ్ధమౌతున్నవి. బాగా ఆలోచించండి.

సీతా:- [రోషంతో] ఆలోచించి, ఆలోచించి, అర్థంలేకుండా, అనాథగా, పరాన్నభుక్కులకు, పరమ దుర్మార్గులకు పాప మంటే ఏమిటో తెలియని పాపాత్ములకు లొంగిపొమ్మనటమే కదూ నీవు చెప్పేది!

రామ:- అది లొంగిపోవడం కాదు బాబూ! పరిస్థితుల్ని గుర్తించి ప్రవర్తించడం.

సీతా:- నిప్పులు చిందించే యీ అగ్నిగుండాన్ని చల్లార్చనద్దు. రామచంద్రరావ్! అఖండంగా కొనసాగే యీ సమరాన్ని చేతులారా మధ్యలో నిలపొద్దు.

(నేపథ్యంలో అడివంతా ప్రతిధ్వనించేట్లు 'బాబూ!', 'బాబూ!!' అనేశబ్దాలు విన్పిస్తూవుంటవి. సీతారామరాజు, రామచంద్రరావు యిద్దరూ కలసి ఆశబ్దము వచ్చువైపు అటూ ఇటూ చూస్తూవుంటారు.)

లోపల:- బాబూ!

సీతా:- ఎవరు?

లోపల:- బాబూ!

రామ:- మన్యంవారేనేమో!

సీతా:- పోతన్నా! భీమన్నా! కొండన్నా! వీరన్నా! అగ్గన్నా! మల్లన్నా! సింగన్నా!

(సీతారామరాజు రంగస్థలమంతా భీభత్సంగాతిరుగుచూ అరుస్తాడు. రంగస్థలంమీద తిరిగేటప్పుడు, ఆ విసురుకు క్రిందనున్న ఆకులలములు, దుమ్ము పైకి ఎగురును. చెట్టుదగ్గర పెట్టియున్న అంబులను, బాణమును తీసుకొని శబ్దము వచ్చువైపు హుటాహుటిన, నడచిపోతాడు. రామచంద్రరావు అనుసరిస్తాడు. సింగన్న మరియొక వైపునుంచి నేలమీద ప్రాకుతూ వస్తాడు. సింగన్న గుండెమీద తుపాకిదెబ్బకు తగిలిన గాయంనుంచి రక్తం కారుతూవుంటుంది. చిందే నెత్తురును తన అరచేతిగుండా అదిమిపెట్టి ప్రాకుతూ వస్తాడు. అదిమిపెట్టినప్పటికీ రక్తంకారుతూ అరచేయి అంతా తడిసి రక్తమయమై వుంటుంది. వ్రేళ్ళ సందునుంచి రక్తం కారుతూనే వుంటుంది. వెనుకనే సీతారామరాజు, రామచంద్రరావు వచ్చి సింగన్నను చెరియొక వైపునుండి పైకి లేవనెత్తుతారు. సింగన్న మరణబాధతో)

సిం:- బాబయ్యా!

సీతా:- సింగన్నా!

సిం:- బాబయ్యా!

సీతా:- సింగన్నా!

రామ:- సింగన్నా!

సిం:- అబ్బ! బాబయ్యా!

సీతా:- సిం...గ...న్నా!

సిం:- బాబయ్యా! అంత అయిపోయింది బాబయ్యా!

సీతా:- ఏం చెప్తున్నావ్?

సిం:- మన్యం ఒక్కొక్క అడుగే మట్టిలో కలిసిపోతూంది బాబయ్యా!

రామ:- ఏమిటి సింగన్నా?

సిం:- బ్రిటిష్ వాండ్ల రాక్షసకృత్యాలు హద్దులు దాటిపోయేయి బాబూ!

సీతా:- వాటిని అణగద్రొక్కే వందలాది మన్యంవీరులు అప్పుడే...

సిం:- అప్పుడే అంతకే హతంకాలేదు బాబయ్యా! గాము కొండ గుహలోని కాళికామాతవద్ద కవోష్ణరక్తంతో బొట్టుపెట్టుకొని వందలాది మన్యంవీరులు యుద్ధానికి సన్నిద్ధం ఔతూనే వున్నారు. ఒంజేరిలో చొరబడ్డ బ్రిటిష్ సైన్యం, మన్యంవీరులు కురిపించిన అంబులదెబ్బలకే పరుగెత్తి కాళ్లకు బుద్ధిచెప్పింది. మీ పేరు స్మరిస్తూ, మీ వీరనామంలోంచి స్ఫూర్తి తీసుకుంటూ కొండంత వుత్సాహంతో వీరులు ముందుకు వస్తూనే వున్నారు.

సీతా:- నా వీరులునమ్మిన ఆంజనేయులు......

సిం:- అబ్బ! ఆంజనేయమూర్తులంతా నేలకొరిగిపోతున్నారు. బాబయ్యా! నాకు తలయేదో తిరిగిపోతూవుంది! కొండంత బరువు నెత్తినేదో దూకినట్లుంది. ప్రాణంపదో ఎగిరి పోతున్నట్లుగా వున్నది. అబ్బ! పడాలరాజును వురికంబ

మెక్కిం చేరు. అగ్గిరాజును నిలువునా కాల్చేసేరు. రామన్నన్న కొండలబండలమీదనుంచి క్రిందకు త్రోసేరు. పోతన్నను, పులిరాజును బాయినేట్లతో పొడిచి చంపేరు. యీ మన్యంలో నేడు పతివ్రతామతల్లులైన స్త్రీజాతికికూడా భంగం......

సీతా:- అహా! చెప్పొద్దు సింగన్నా, చెప్పొద్దు. ఈమాటొక బల్లెపుపోటు. ముళ్లపొదలకు తెల్లపాగాలచుట్టి తెల్ల దొరలను హతమార్చిన పడాలవీరుడుకూడా అస్తమించేడా! మన్యంసింహాలను అంతముచేసిన హంతకులను తిరిగి అంతముచేయనిదే తిరిగిరాడు యీ సీతమరాజు! ఆ హంతకులరక్తంతో మన్యందేవత కభిషేకం చేస్తాను. ఒక్కొక్క కత్తిదెబ్బకు ఒక్కొక్క కిరాతకుడ్ని అంతము చేసి ఒక్క లిప్తకాలంలో మన్యంలో తలెత్తితిరిగే నాగు బాములన్నింటినీ నాశనంచేసి వస్తాను.

[సింగన్నను వదలిపెడ్తాడు. శూన్యంలోకి చూస్తాడు. మరల తెప్పరిల్లుకొంటాడు. అటు మరల దెబ్బతిన్నట్లాచులా మండిపడుతూ రంగస్థలమంతా భీభత్సంగా కేకలు పెడ్తాడు.]

సీతా:- ఓ తెల్లజాతి కిరాతకుల్లారా! మానవరూప మ్లేచ్ఛులారా! సర్వదేశాలను కబళించి రత్నరాసులతో తుల తూగుచున్నామని విఱ్ఱవీగు ఓ నరజాతి భక్షకులారా! మర తుపాకులతో, మందుగుండు సామగ్రితో మీ సైనికబలం సిద్ధంగా వుందని గర్వపడొద్దురా! మీ రెచ్చటున్ననూ సరే! సముద్రాలకు సముద్రాలనేదాటి, మీ లండన్ నగర

వీధుల్లో తలదాచివున్ననూసరే, లేదా సముద్రగర్భాంత రాళ్లల్లో శరణుబొందిననూ సరే, కొండలదాటి కారడవుల పుట్టల్లో 'దేహీ!' యన్ననూ సరే, యీ అల్లూరు సీతా రామరాజుమాత్రం మిమ్ములను వదలడు.

[సీతారామరాజుమాటలకు సింగన్న, రామచంద్రరావులు ఒకరి నొకరు ఒక్కక్షణం చూచుకుంటారు. సింగన్న మరింతబాధతో క్రుంగి పోతూ భూమిమీద కాలుబెట్టను శక్తిలేక క్రిందకు ఒరిగిపోబోతున్నాడు. సీతారామరాజుమాటలకు రామచంద్రరావు శరీరమంతా కదలిపోతూ వుంది. శరీరమంతా చెమ్మటలు క్రమ్ముతుంటవి. ఒరిగే సింగన్నను రామచంద్రరావు మెల్లగా క్రిందకువదలి అక్కడ పడియున్న మానుకు ఆనించి కూర్చుండబెడతాడు. సీతారామరాజు వెనుక, బిత్తరగా తిరుగుతాడు.]

సీతా.- రాక్షసత్వానికి పుట్టినిల్లైన నీ లండన్ నగర సింహాస నాన్ని సైతము మసిచేస్తాడు,

(సింగన్న ప్రాకుతూ వచ్చి సీతారామరాజుకాళ్లు పట్టుకొని మాట్లాడుతాడు,)

సిం:- (బిగ్గరగా) బాబూ!

రామ:- ఉద్రేకపడకండి!

సిం:- దణ్ణంబెట్తా బాబయ్యా! యుద్ధాన్ని ఆపండి! మీరు పోవద్దు. మీరు మన్యానికే గుండెకాయ. గూఢ చారులు మిమ్ములను వేయికండ్లతో గాలిస్తున్నారు. మన మన్యంలోని కొంతమంది స్వార్థపరులు వాండ్లకు సాయం చేస్తున్నారు. ఎవరు మనవారో మరెవ్వరు పగవారో అర్థంకాకుండా వుంది. ఈ పరిస్థితుల్లో సాహసించి మీరు బైటకుపోవడం మంచిదికాదు బాబయ్యా!

రామ:- మన మన్యంలోని ప్రజలు దేశద్రోహులై వారికి సాయం చేస్తున్నారా?

సీతా:- ఎందుకో నమ్మలేకుండావున్నాను సింగన్నా!

సిం:- దేశభక్తులకు సైతము మచ్చుమందుబెట్టి దేశభక్తులను దేశద్రోహులుగా తయారుచేయడం తెల్లవారికి వెన్నతో బెట్టిన విద్య. కాకుంటే మనరత్తి ఎందుకు చచ్చిపోయిందంటారు!

సీతా:- రత్తి!

రామ;- రత్తి చచ్చిపోయిందా!

సిం:- ఔను బాబయ్యా! రత్తి తెల్లవారి గుడారాల్లో వెట్టిచాకిరీచేసి నిప్పులాగా బ్రతుకుతూ అనేక రహస్యాలను తెలిసికొని మనకు దాటవేసి ఎన్నో వందల ప్రాణాలను రక్షించిన మేటిమేధావి మన రత్తి! దేశానికి సేవచేసిన నేరానికి బ్రిటిష్‌ఘాతకులు ఆ తల్లిమీద విషపుగుండ్లు కాల్చేరు. ఆ తల్లి బాధ మాటల్లో చెప్పలేను బాబయ్యా! మాటల్లో చెప్పలేను. చచ్చిపొయ్యేటప్పుడు, "మన్యానికి తలకాయ, సీతారామరాజు వెయ్యేండ్లు బ్రతకాలి, వెయ్యేండ్లు బ్రతకాలి" అనంటూ మిమ్మల్నే స్మరిస్తూ కళ్ళు మూసింది, కళ్ళు మూసింది బాబయ్యా, కళ్ళు మూసింది!

(సీతారామరాజు, రామచంద్రరావు కండ్లల్లో జాలిగా కన్నీరు కన్పిస్తుంది.)

సీతా:- విషపుకోరల నాగుబాములను వేటాడి, చీల్చి చెండాడుచూ, గగనవీధులపై తేలియాడు మబ్బులనుచూచి మైమరచి నాట్యమాడు నెమలికన్నెను కనికరములేని కిరాతకుడు కూల్చివేసినాడు. ధ్రువతార రాలిపోయినది. మాంచాలికి మించిన పౌరుషమును ప్రదర్శించిన మన్యంలోని మరోమగువ శాశ్వతముగ నిద్రబోయినది. తను చనిపోతూ నన్ను బ్రతకమని ఆశీర్వదించినది.

సిం:- ఔను బాబయ్యా, రత్తి మిమ్ములను ఆశీర్వదించినది.

సీతా:- రత్తి మన్యానికే రత్నము. రత్నమే రాలిపోతే యిక ముత్యాలహారమేమున్నది! విప్లవరక్తపు రథానికి సింధూరం బూసిన రత్తితల్లి పేరు చెప్పుకొని దణ్ణంబెట్టని తెనుగు బిడ్డడు వుండడు. తెనుగు వీరుల విప్లవధ్వజానికి నీరాజనాల నెత్తి, విప్లవజ్వాలాగీతాన్ని తన కంఠంలోనుంచి విన్పించి, 'విజయీభవ' -పల్కిన వీరవనితపేరు చెప్పుకొని సంధ్యదీపమువద్ద చేతులెత్తి దణ్ణంబెట్టని తెనుగు ఆడబడుచూ వుండదు.

రామ:- రత్తిలాంటి రత్నాలను బలిగొనే యీ విప్లవాన్ని ఆపండి. సర్వస్వాన్నీ స్మశానంచేసే యీ భయంకర యుద్ధాన్ని ఆపండి.

సిం:- బాబయ్యా! రూథర్ రాజీవ్యవహారాల్లో నాకూ నమ్మకం లేదు. తేలుకొండెకు తేనెతెట్టె వుంటుందంటే ఎవరు నమ్ముతారు? కానీ పరిస్థితినిబట్టి మనం ప్రవర్తించాలి. ఈ విషయంలో వీరశివాజి మనకు ఆదర్శమూర్తి! వీరశివాజీ

మనకు ఆదర్శమూర్తి! ఏ పరిస్థితుల్లోకూడా మీరుమాత్రం బైటకు పోవద్దు. అబ్బ! అయ్యో! కడుపులో కాగేనూనె పోసినట్లు భగ్గున మండిపోతూవుంది! అబ్బ!

రామ:- సీతారామరాజుగారూ! అటు చూడండి ఆ అనలం! ఇటుచూడండీ ప్రచండవీరుని మరణంతోగూడిన బాధ!

సిం:- బాబయ్యా! యుద్ధాన్ని ఆపండి. మీరుమాత్రం బైటకు పోకండి. మీరు బ్రతికివుంటేనే మా మన్యం బ్రతికి వుంటుంది. మీలాంటి వీరుల నాయకత్వం యీనాటికే గాకుండా రేపటిక్గూడా కావాలి.

రామ:- అప్పుడే స్వరాజ్యం వస్తుంది. ఈనాడు గాకపోయినా రేపైనా స్వరాజ్యం వస్తుంది. వస్తుంది స్వరాజ్యం. స్వరాజ్యం వస్తుంది.

సిం:- ఔను! స్వరాజ్యం రాకమానదు. ఆనాడు దేశంలో సరైన నాయకత్వం లేకపోతే, మళ్లీ దేశంలో అలజడులూ, అల్లర్లూ, అంతఃకలహాలూ, అనంత రక్తప్రవాహాలు నిరంతరము కొనసాగుతుంటవి. మీరు నేటికే కాకుండా రేపటి క్కూడా కావాలి.

రామ:- సింగన్న చెప్పింది వాస్తవం. సత్యాన్ని పల్కేవు సింగన్నా! అల్లూరు సీతారామరాజు నాయకత్వం బానిస దేశపు స్వాతంత్ర్య పోరాటానికేగాకుండా, సర్వస్వాతంత్ర్య స్వేచ్ఛాయుత దేశపు శాంతియుత పరిపాలనక్గూడా కావాలి.

సిం:- బాబయ్యా! నా మాట వినండి. స్వరాజ్యం వచ్చిన రోజున వీరుని నాయకత్వం మాకు కావాలి. బాబయ్యా! మీ కాళ్లకు దణ్ణంబెడ్తా. మీరుమాత్రం బైటకు పోవద్దు. పోరుమాత్రం కొనసాగించొద్దు. అబ్బ! అమ్మగారుమాత్రం సురక్షితంగా కాళికాలయంలోనే వున్నారు. అబ్బ! అమ్మ!

(లోపలనుంచి సీతారామరాజు తల్లి నారాయణమ్మ)

లోపల:- సింగన్నా!

సిం:- అమ్మా!

లోపల:- సింగన్నా!

సిం:- అమ్మా!

లోపల:- ఎక్కడున్నావు నాయనా! (సింగన్నదగ్గరకు వస్తుంది.)

సిం:- (బాధతో) అ...మ్మా!

తల్లి:- సింగన్నా! ఎంతపని చేసేవునాయనా! నన్ను రక్షించే దానికోసం నీ గుండెను బ్రిటిష్‌వాండ్ల తుపాకికి ఎదురు పెట్టేవా!

సీతా:- (ఆశ్చర్యంగా) ఏమిటమ్మా నీవు చెప్పేది?

తల్లి:- అల్లూరు సీతారామరాజునుకన్న తల్లిని బ్రిటిష్ రాక్షస యినుపసంకెళ్ళతో బంధిస్తే, ఆ వీరుడు భగ్గునమండి, 'మాతృసేవా పరాయణుఁడు అల్లూరు సీతారామరాజు' బైటకువస్తాడని తెల్లజాతినక్కలు వుపాయాన్ని పన్ని ఒక్క తెల్లసిపాయిని, కాళికాలయందగ్గరకు పంపించినారు.

రాము:- తెల్లసిపాయా! మన సీతారామరాజు రహస్య స్థలమైన కాళికాలయము దగ్గరకా!

తల్లి:- అవును! నన్ను బంధించేదానికోసం ఆసిపాయి పై కురికేడు. ఉరికిన మృగాన్ని పట్టేదానికోసం సింగన్న మరింత పై కురికేడు. చెట్టుచాటునున్న మరో సిపాయి సింగన్న గుండెమీద మరో తుపాకి కాల్చేడు. వెంటనే నన్ను బంధించపోయేరు. అదెక్కడి శక్తో! సింగన్న కొండంత ఎత్తుగా పెరిగేడు. వేయి సింహాలశక్తి అది. పోటెత్తిన ఒక మహాసముద్రం. ఉగ్రుడైన నరసింహావతారం. సింగన్న వాళ్ళిద్దర్ని పట్టి ఒకేఒక కత్తిదెబ్బకు రెండుతుంటలు చేసేడు...నాకోసం ఈ వీరుడు బలి ఔతున్నాడు నాయనా! బలి ఔతున్నాడు.

రామ:- సింగన్నజీవితం ధన్యమైంది. సింగన్నా నీ జీవితం, ధన్యమైంది.

(అప్పుడు సింగన్నముఖంమీద సంతోషం కన్పిస్తుంది.)

సిం:- అంతకన్నా నాకింకేం కావాలి. (రామచంద్రరావుతో) సీతారామరాజు మహావీరునిగన్న వీరమాతకోసం, ప్రాణాలర్పించడంకన్నా యింకనాకు వేరేభాగ్యంలేదు. బాబూ! (సీతారామరాజు ప్రక్కతిరిగి) నా తుదికోర్కెను తీర్చండి బాబయ్యా! మన్యంకోసం మీరు తాత్కాలికంగా రూథర్ తో రాజీపడండి. రాజీమాటలకోసం తొలిసారిగా తెల్లవాండ్లే వచ్చేరు. కాబట్టి, లొంగిపోయింది తెల్లజాతి కాని, మనంకాదు. లొంగిపోయింది బ్రిటిష్ వాండ్లు కాని భారతీయులు కాదు.

తల్లి:- ఔనునాయనా! లొంగిపోయినది వాండ్లే! మనంకాదు!

రామ:- అంతేనండీ, అమ్మచెప్పింది కాదనకండి.

తల్లి:- ఒప్పుకో నాయనా! సింగన్న తుదికోర్కెను తీర్చు నాయనా! మన్యమంటే సింగన్నేగా!

సీతా.- రాజీమాటలవల్ల మన్యం బాగుపడ్తే, నా తల్లి భారత మాత చిరకాల దాస్యబంధాలు వీడిపోతే నాకదేచాలు!

సిం.- ఔను బాబయ్యా! స్వతంత్రం వస్తుంది. బాబయ్యా! దాస్యం పోతుంది! చీకటి పోతుంది! కలువు పోతుంది! బీదసాదలకు కడుపునిండా అన్నం దొరుకుతుంది! బీదోడి యింట్లోకూడా పచ్చతోరణం కన్పిస్తుంది. యింటింటా పండుగ రోజూ కన్పిస్తుంది. (సంతోషంతో) యింక చచ్చి పోతానుబాబయ్యా! బాబూ! అబ్బ! యింక శెలవ్! అమ్మా! (చేతులెత్తి నమస్కారం చేస్తాడు. సింగన్న ప్రాణాలువదల్తూ తన చేతిని ఎత్తి సీతారామరాజువైపు చూస్తాడు. సీతారామరాజు ఆ చేతిని ఒక్క క్షణంకాలం తనంచేతితో పట్టుకుంటాడు. శూన్యం లోకి చూస్తాడు. మెల్లగా బాధతో జారవిడుస్తాడు.)

సీతా:- మన్యంలోని మరో మహావీరుడు నేలకొరిగినాడు. అమ్మా! ఈ వీరుని మృతకళేబరాన్ని యే మ్లేచ్ఛుడి తెల్ల జాతి కిరాతకుడూ తాకకూడదు. వీరోచిత మర్యాదలతో శాశ్వత నిద్రబోతూవున్న సింగన్న మహావీరుని భూదేవి గర్భంలో దాచమ్మా!

తల్లి:- సరేనాయనా! భారతీయవీరుడ్ని చనిపోయిన తరువాత కూడా ఆ ముష్కరజాతి అంటకూడదు.

(సింగన్న శరీరమునకు తలవద్ద తల్లి నారాయణమ్మ, కుడిప్రక్కన సీతారామరాజు, ఎడమవైపున రామచంద్రరావు వుండి లోపలకు తీసుక పోతూ వుంటారు. నేపథ్యంలోనుంచి కొన్ని క్షణాల్లో బాధతో కూడిన యీ పాట విన్పిస్తుంది.)

మన్యానికే సింహమూ
మహారాజు సింగనా ॥మ॥
స్వాతంత్ర్యపోరాట
బలిదానవీరుడు
మహాబలిసింగనా ॥మ॥

(పాట ఐపోతుంది. సీతారామరాజు, రామచంద్రరావు, మాట్లాడు కుంటూ, రంగస్థలంమీదకు వస్తారు.)

సీతా:- మన్యంలోని పదిమంది సైన్యాన్ని పట్టుకునేందుకు ఏనుగబలము, విమానశక్తి, మరఫిరంగులతోడి మహా సైన్యము, వీటన్నిటికీ మించి వేనకువేల పశుతుల్యమైన రాక్షససైన్యం! సిగ్గుచేటు!...పదండి. రామచంద్రరావు గారూ! రాజీమాట లేమిటో తేల్చుకుంటాం పదండి.

రామ:- మీరూ వస్తారా!

సీతా:- వస్తాను. రాజీమాటలు తేలకపోతే రూథర్ ఫుడా రాన్ని రణరంగం చేస్తాను.

రామ:- అంతమంది సైన్యంలోకి మీరొక్కరు...?

సీతా:- అవును! యీ పరశురాముడు అంతమంది సైన్యం లోకి వచ్చి ఆ ప్రదేశమును శత్రుమూక రక్తంతో తడిపి ముద్దగావిస్తాడు.

రామ:- మీ రిక్కడే వుండండి. నా మాట వినండి. రూథర్‌ను యిక్కడికే తీసుకవస్తాను.

సీతా:- కాదు! నేనే అక్కడికి వస్తాను! లక్షలాది శత్రువుల మధ్యనైనాసరే భారతీయవీరుడు జంకడు రామచంద్ర రావ్!

రామ:- అదికాదండీ! మీరు ఆ బ్రిటిష్‌వాండ్ల దగ్గరకు రాకూడదు. బ్రిటిష్ వాండ్లు సీతారామరాజు దగ్గరకు రావాలి. ఇది నా కోరిక! రాజీలు వాండ్లు మీతో జరపాలి. అందుకే మీ రిక్కడే వుండాలి. యిప్పుడే రూథర్ ఫర్డు దొరను యిక్కడకు తీసుకవస్తాను.

(రామచంద్రరావు వెళ్ళిపోతాడు. సీతారామరాజు అటూ, ఇటూ తిరుగుతూ ఆలోచిస్తూవుంటాడు.)

సీతా:- ఈ రాజీమాటల్లో నాకు నమ్మకం లేదు. దైవం ఏమి చేయనున్నాడో అసలే తెలియడంలేదు. విచిత్ర పరిస్థితుల్లో రాజీమాటలకు రమ్మన్నాను. భారత దేశ భవిష్యత్తు ఏవిధంగా వుంటుందో అసలే అర్థం కావడంలేదు. ఓ భారతమాతా! నీ భవిష్యత్తు చిమ్మచీకటిగా కన్పిస్తున్నదమ్మా! ఒకవర్గం అహింసా ప్రచారంతో స్వాతంత్ర్యం సంపాదించాలంటూ వుంది. అది ఎంతవరకు సాధ్యమో నాకర్థం కావడంలేదు. నే చేసేవిధానం మంచిదికాదని, అది హింస అని కొందరంటున్నారు. ఆకలితో పైపైకి దుమికే మృక్కిడిమృగాన్ని చంపడం ఎవరైనా హింస అంటారా! కండలో చావలేక, చచ్చేదానికి ధైర్యంలేక,

కొంపలు మునిగేటప్పుడుకూడా రామభజన చేయడం నాచేతగాదు. అమ్మా! భారతమాతా! ఈ అహింసా విధానంవల్ల నీ కాలు తెగిపోతుందో, నీ కంఠమే ఎగిరి పోతుందో తెలియడంలేదు. మనకు కావల్సింది సంపూర్ణ స్వరాజ్యం. దానికోసం బ్రహ్మాండమైన పోరాటం.

(సీతారామరాజు వెనుకనుంచి తల్లి లోపలికి ప్రవేశిస్తుంది.)

తల్లి:- ఔనునాయనా! నీవంటున్నది నిజం! ఏ అఖండభారత స్వాతంత్ర్యంకోసం యింతవరకూ లక్షలాది వీరులు తమ రక్తాన్ని చిందించేరో, వారి కోర్కెలు సఫలం చేయకుండా, భవిష్యత్తులో మరేఒప్పందానికైనాసరే, ఏ భారతీయుడైనా సరే, ఒప్పుకున్నాడంటే అది పచ్చి దేశద్రోహమే ఔతుంది.

సీతా:- స్వాతంత్ర్యంకోసం యే భారతీయుడుకూడా అమ్ముడు పోలేదు లేమ్మా!

తల్లి:- ఔనునాయనా! అమ్ముడుపోలేదు. కన్నబిడ్డ ఆ పనిని చేయలేదు. నాయనా! వీరుడివిగనే ప్రవర్తించు. తెల్ల జాతిని జాగరూకతతో వేయికండ్లతో కనిపెట్టు. రాజీ లకు వచ్చు ఆ నీచులతో మెళకువగా ప్రవర్తించు. ఆనాడు శివాజీ మహావీరునితో మాటలాడుటకని వచ్చిన అఫుజుల్ ఖాన్, శివాజీ వీరునియందు అత్యంతప్రేమ చూపువాడివలె, ఆలింగనము చేసికొనుచూ దాచియున్న బాకుతో ఆ మహావీరుని చంపబోయెను. దేశముకాని

దేశమునుండి వచ్చిన దోపిడీగాండ్లందరూ చేయు విధానమే అది. అందుకే, జాగ్రత్తగా వుండునాయనా! జాగ్రత్తగా వుండు.

సీతా:- అలాగేనమ్మా!

తల్లి:- రాజీలకువచ్చు బ్రిటిష్‌వాండ్లతో తలవంచి మాట్లాడ వద్దు. ఛాతీచూపి జవాబుచెప్పు, మన సాంప్రదాయానికి వ్యతిరేకమైన యే ఒప్పందానికీ నీవు అంగీకారం చూపొద్దు.

సీతా:- నీవు కన్నబిడ్డ సాంప్రదాయానికి, చరిత్రకు వ్యతిరేక మైన యే పనులూ చేయలేడమ్మా!

తల్లి:- రాజీయే కుదరకపోతే మన్యంలోని మగువలుకూడా మహావీరవనితలై అడుగడుక్కీ యీ మహాయజ్ఞంలో రక్తాన్ని చిందిస్తారు.

సీతా:- బ్రిటిష్‌వారి రాజీయే కుదరకపోతే, బ్రిటిష్‌జాతి దాసోహామే అనకపోతే, నీ వందించే ఆశీస్సుల బలంతో ప్రచండ భీకరసమరాన్ని స్వరాజ్యం వచ్చిందాకా కొన సాగిస్తాను. ఆ బ్రహ్మాండమైన యుద్ధంలో ప్రతి భారతీయుడూ ఒక్కొక్క మహాయోధుడు కావాలి! ప్రతి భారతీయ యువకుడూ ఒక్కొక్క అభిమన్యుడూ, బాల చంద్రుడూ కావాలి! ప్రతి భారతస్త్రీకూడా మహారాణి ఝాన్సీ, వీరవనిత మాంచాలి కావాలి!

తల్లి:- అవును! ప్రతి భారతస్త్రీకూడా నిప్పులు చిందించే ఒక్కొక్క కాళికారూపం కావాలి! కాళికామాత పద

ఘట్టనకు అసురలోకము మట్టిలోకలసినట్లు పీడించి పిప్పి చేసే యీ పరజాతి పతనమైపోవాలి!

సీతా:- అది తప్పదమ్మా! యేనాటికైనా పరాన్నభుక్కులు పతనము చెందవలసినదే, అమ్మా! నీవు పోయి మన మన్యం ప్రజలను జాగ్రత్తగా చూస్తుండమ్మా! సీతారామరాజు తల్లి పనిపించమ్మా!

తల్లి:- అలాగే నాయనా!

సీతా:- అమ్మా!

తల్లి:- ఏమి నాయనా! (మరింత దగ్గరకు వస్తుంది.)

సీతా:- (కొన్ని క్షణాలు శూన్యంలోనికి చూస్తాడు. ప్రక్కనున్న తల్లిని చూస్తూ.) లక్ష్మన్నకు, రామన్నకు, గాముసోదరులకు, గంటందొరకు నా మాటగా యీ మాట చెప్పమ్మా!

తుదిసైనికుడు వున్నంతవరకూ యుద్ధం జరుగుతూ వుండాలి! తుది రక్తపుబిందువు వున్నంతవరకూ ప్రతి సైనికుడు పోట్లాడుతూ వుండాలి. చనిపోయేటప్పుడుకూడా, వూపిరి బిగించుకొని, ఒక్క బ్రిటిష్ సిపాయినైనాసరే చంపి ప్రాణాలొదలాలి.

(బిడ్డమాటలకు తల్లి పరవశము జెంది, ఆవుద్రేకముతో మాట్లాడు తుంది.)

తల్లి:- ఔను నాయనా! పీడించి పిప్పిచేసే పరజాతిరక్తం, భారతదేశపు సరిహద్దుల పరగణాలవరకు ప్రవహించాలి. ఆ రక్తపు టేరులో మన మన్యందేవతకు అభిషేకం చేయించాలి, అభిషేకం చేయించాలి!

నిన్ను దేముడు రక్షిస్తాడు నాయనా! నిన్ను దేముడు రక్షిస్తాడు. అకుంఠిత దీక్షతో, అఖండ రాష్ట్ర సంపూర్ణ స్వాతంత్ర్యంకోసం అహోరాత్రులు యజ్ఞం చేసే, ఓ సీతమరాజూ! నిన్ను దేముడురక్షిస్తాడు! నాయనా! నిన్ను దేముడు రక్షిస్తాడు.

సీతా:-(పట్టరాని సంతోషంతో) అమ్మా! (తల్లిపాదాలకు నమస్కారం చేస్తాడు. యిద్దరూ క్షణకాలం ఒకరివైపు మరొకరు చూచుకుంటారు. తల్లి మెల్లగా బరువు కాళ్ళతో ఒకవైపుకు వెళ్ళిపోతుంది. తల్లి పోయినవైపుకు సీతారామరాజు ఒక్క క్షణకాలం చూస్తాడు. అటూ ఇటూ తరుగుతూ వుంటాడు.)

రాజీలు! ఒక్క అంగుళం మేరకు స్వరాజ్యం నిరాకరించబడినా, ఆ ఒప్పందం నా తల్లికి మరో బంధం. సముద్రాలు దాటి, యోజనాలు నడచి, యింటి కుక్కల వలె పొట్టలు నింపుకుంటున్న యీ పరజాతి, అసలు ఒక్క అడుగునకైనా భారత దేశమునకు, పరత్తులేక, కుయుక్తి లేక, కుట్రలులేక స్వాతంత్ర్య మిచ్చునా! నాకు నమ్మకం లేదు. ఒక ప్రక్క సంధిప్రయత్నములు మరి యొకవైపు సమర సన్నాహములు. రూథర్, సీతారామరాజుల కలయిక సంపూర్ణ స్వరాజ్యము తెచ్చునో లేక ప్రచండ భీకర సమరాగ్నిని లేవదీచునో! ఒకవేళ స్వరాజ్యమే వచ్చిన, అబ్బ! భారతీయుల కీ దినము మహా పర్వదినము. (ఎక్కడినుండో గుడిగంటలు విన్పించును. క్షణకాలం సీతారామరాజు ఆవైపు చూస్తాడు.)

లేదా యిప్పుడే భారతీయులందరూ స్వాతంత్ర్య సమర సన్నాహ దీక్షాకంకణధారు లౌదురు! స్వరాజ్యమో

లేక యుద్ధమో! సంపూర్ణ స్వరాజ్యమో లేక ప్రళయకాల భీకర సమరాగ్నుల వర్షమో! సంపూర్ణ స్వేచ్ఛా వాయువుల బీల్చడమో లేక వీరస్వర్గ మలంకరించడమో, సర్వస్వతంత్ర్య భారతమాతను యీకండ్లతో చూడడమో, లేక స్వాతంత్ర్య పోరాటంలో యీకళ్ళు మూయడమో! ఏదో ఒక్కటి తేలాలి!

(తెరవెనుక మిలటరీసైన్యము నడచు బూటుశబ్దములు, గుఱ్ఱపు డెక్కల శబ్దములు విన్పించుచుండును. రంగస్థలంమీదకు రామచంద్రరావు రూథర్ ఫర్డుదొర వస్తారు. ఆశబ్దములు మెల్లగా నిలచిపోతవి.)

రామ:- సీతారామరాజుగారూ! వీరే రూథర్ ఫర్డు దొర.

సీతా:- కన్పిస్తూనే వున్నాడుగా!

రూథ:- సీతారామరాజుగారూ! చూచేదానికి మీ వేషం, మీ దేశానికి పెద్దపెద్ద దేముడైన రామచంద్రుడిలా వుంది. నీవు చాలా పెద్ద సింహము అని, నీవు మనుష్యులను చీల్చి చెండాడుతావనీ విన్నాము.

సీతా:- గోముఖవ్యాఘ్రమా! మాజాతిది నిర్మల మందాకినీ ప్రశాంతవదన స్వరూపం. కదిపితివా, నీ కన్నులమెరనే ఘణఘణ తేజస్సు యిప్పుడే కన్పిస్తుంది! నా భుజబలమేమిటో నేరుగానే చవిచూస్తావు.

రూథ:- వాట్! నేనూ ఎవరో నీకూ బాగా తెలుసునా!

సీతా:-పలనాటి హనుమంతుని శౌర్యమునకు, నీ సైన్యమంతా నాశనమైతే, నీ గుండెలు పగిలి రాజీవ్యాపారములతో ఆ వీరుని చాటుకి రప్పించి వెనుకనుంచి చంపిన పిఱికిపంద

వనే సంగతి నాకు బాగా తెలుసు! భారతీయుల రక్తంతో పొట్టలు నింపుకొనే ఆ బ్రిటిష్‌ప్రభుత్వపు తాబేదారువనే సంగతి నాకు బాగా తెలుసు!

రూథ:- సీతారామరాజుగారూ! రాజీమాటల్లోకూడా కొద్ది కొద్దిగా కోపం దేనికి?

సీతా:- రాజీ! ఏమిటి నీ రాజీ!

రూథ:- మీరు యీ మన్యానికే ఒక పేద్దపేద్ద సింహము. ఇప్పుడు అంత పేద్దపేద్ద సింహము యాఫ్టరాల్, ఎండు గడ్డికొఱకు వచ్చిందా?

సీతా:- రూథర్! ఈ సింహం ఎండుగడ్డి కొరకదు. అవసర మైతే తన పంజావిప్పి నీ గుండెల్ని చీల్చి రక్తాన్ని త్రాగేస్తుంది!

రూథ:- హ్హో మీరు చాలా నైస్‌గా మాట్లాడ్తారే! యిండియన్స్‌కు పానిచేయడంకన్నా పనికిమాలిన మాటలు బాగా వస్తవి. ఓట్టిఓట్టి స్పీచస్‌తో లాభంలేదు. మీకూ మాటాలు చాలాబాగా వచ్చినట్లు వుంచి! వెరీ నైస్‌స్పీచ్! హ్హా! హ్హా! హ్హా!

సీతా:- సున్నితమంటే మీకేం తెల్సు! దేశాన్ని కొల్లకొట్టె డెకాయిడ్స్!

రూథ:- షటప్!

సీతా:- యూషటప్! షష్టఫాల్!

రూథ:- వాట్! పెద్దపెద్దగా కేకలుపెట్టినచో పేట్రియాటిజం కాదు. మా దేశముయొక్క భక్తిఅంటే యేమిటో యిప్పుడే మేము ప్రదర్శనము చేస్తాము.

(రూథర్ ఫిస్టల్‌తో సీతారామరాజు మోకాలుమీద కాలుస్తాడు. రక్తం చిందుతూ వుంటుంది. బాధను లెక్కచేయడు. ఉగ్రుడై రెండు పిడికిళ్ళూ బిగించి రూథర్‌ను కొట్టబోతాడు. రామచంద్రరావు వారించి అడ్డుపోతాడు. యింతలో రూథర్ తన చేతనున్న విజిల్‌ను వూదుతాడు, రెండువైపులనుంచి ఎనిమిదిమంది సిపాయిలు వచ్చి సీతారామరాజును రామచంద్రరావును పట్టుకుంటారు.)

సీతా:- నరజాతిరాక్షసుడా! రక్తం త్రాగతా! గుండెల్లో ధైర్యంలేని పిరికిపందా! (బిగ్గరగా) రూథర్! హంతకుడివిరా! రక్తానికి రక్తం! నీశిరస్సు పగులగొట్టి ఆరక్తాన్ని యీ భూమిమీద క్రుమ్మరిస్తాను. ప్రతీకారం! ప్రతీకారం తీర్చుకుంటాను. నిలువ్! (ముందుకు రాబోతాడు. సిపాయిలు వెనక్కు లాగుతారు.)

రూథ:- (వెనుకడుగువేస్తూ, ఫిస్టల్ గురిచూపిస్తూ) ఏయ్ ఒక్క అడుగు ముందుకు వచ్చినావా, యీ ఫిస్టల్ సెల్స్ నీ లైఫ్‌తో ఆట్లాడుకొంటావి?

సీతా:- కుట్ర! బంధిపోటుల పిరికితనం! దగాకోరుల రాక్షసత్వం! దోపిడీచేసే దొంగల్లారా!

రూథ:- పోలీస్ స్టేషన్లమీద పట్టపగలే పడి రైడ్ చేసి లూట్ చేసే రోగ్స్ మీరుకాదా?

సీతా:- అట్లానే ప్రేలేవంటే అణచిపారేస్తాను. యిదేనా హంతకుడా! నీ తెల్లజాతి రాజకీయ నీతి! ఇదేనట్రా నీ బ్రిటిష్‌సామ్రాజ్యపు గుండెధైర్యం.

రూథ:- ఇంకా పెద్దపెద్ద వాయిస్‌తో కేకలు పెట్టు. దోపిడీ చేసే దొంగా!

సీతా:- (బిగ్గరగా) రూథర్! ఎవరు దొంగ? ఎవరు హంతకులు? ఎవరు దగాకోర్లు? ఎవరు దోపిడీదార్లు? నేనా దొంగను? నీవా దొంగవు? ఎంగిలిఆకులకోసం సముద్రాలకు సముద్రాలనే దాటి, దేశంకాని దేశంలో కాలుపెట్టి, దిక్కూదివాణంలేని కొంపలోపడి దోచుకతినే సర్వభక్షక మృక్కడిమృగాలు మీరుకాదా!

రూథ:- బాగా నాయిస్ చేయ్! యింకా న్యూసెన్స్ చెయ్! ఆకలితోవున్న సింహంలాగా పెద్దపెద్దగా గుండేలు పగిలిపోతూ గర్జిస్తున్నావ్! నీ పెద్దపెద్ద అరుపులు మాకు చాలా చాలా ఆనందాన్ని యిస్తూవుంది. యింకా పేద్దపేద్ద కేకలుచాలా అధికముగా చేయి! నీవు ఎంత పెద్దగా గర్జించినా నీ స్వంతదేశంలో నీకున్న దేశభక్తికి రెస్పాన్స్ లేదు. నో రెస్పాన్స్! ఆల్ మోస్ట్ అంతా పిరికిపందాలు!

సీతా:-హుఁ (ఒక్క గర్జన) రక్తంలోనే పిరికితనం ప్రవహించే కుక్కా! జాతిలోనే నీచత్వం కరడుగట్టిన లుబ్ధా! నీ రాజకీయాల్లో ధర్మమేవుంటే, నీ గుండెల్లో వేడినెత్తురే వుంటే, రారా, యుద్ధానికి రా! నాతో యుద్ధానికి రారా! పిరికిపందా! ఇది ప్రళయకాల రుద్రరూప భయంకర జ్వాలాజ్వలిత అగ్నిగుండంరా! ఈ అగ్నిగుండం ప్రేలిందా, నిన్నేకాదు, సముద్రాలకు సముద్రాల నావల దాగియున్న

నీ కుక్కగొడుగు సింహాసనాన్నికూడా అధోపాతానికి అణగద్రొక్కుతుంది.

రూథ:- షటప్! వాచాన్! రైఫిల్ పై రాన్ చేస్తున్నా! బి రెడీ!

రామ:- రూథర్!

రూథ:- షటప్!

రామ:- యిది నీకు ధర్మమా?

రూథ:- యూ షటప్ ఫష్టఫాల్! పనికిమాలిన దద్దమ్మా!

రామ:- రూథర్! రాజీయని నాకుచెప్పి, కడకు చూచుటకైనను మీకు చేతకాని అల్లూరు సీతారామరాజు మహావీరుని మీ రాక్షస యినుప బంధములచెంతకు నాచేత తీసుకొని వచ్చునట్లు చేసితిరా! రాజకీయ రాజీల చదరంగములో రక్తపుమడుగుల నేర్పరచినారా! ఇదిసభ్యతా? ఇది న్యాయమా? ఇది ప్రపంచధర్మమా?

రూథ:- యూ ఫూల్! నీవుకూడా ఫవర్ ఫుల్ విప్లవ వీరుడిలాగా మాటలాడుచున్నావు! సీతారామరాజుని పాట్టేదానికోసం, పేద్ద చేపాను పట్టాను, గేలామూకు మెర్రలాగా నిన్నూ వుపయోగించుకున్నాము. అక్కడ చేప ఎర్రాను తింటుంది. పని ఐపోయింది. యిప్పూడు, యిక్కాడ, నిన్నూ మేమూ తింటాము.

సీతా:- (పోలీసులను ముందుకు లాగుతూ రూథర్ మీదకు పోబోవును. పోలీసులు వెనక్కులాగుతూ వుంటారు.) రూథర్! అమాయకుడైన రామచంద్రరావును కాదురా కాల్చేది. అతన్ని

వదలు! అదినీతిరా! ఇదిగో అల్లూరు సీతారామరాజు గుండె! (ఎదను ముందుకు విరుస్తాడు.) కాల్చురా! కాల్చు!

రూథ:- కాల్చమంటే దయచూపి నిన్నూ వదలాము!

సీతా:- ఛీ! కాల్చురా!

రూథ:- అయితే, బి రెడీ! కాచుకో!

సీతా:- ఏయ్! నీవ్వూ కాచుకో! నీవు కాల్చిన కాల్పులకు నా గుండెల్లోనుంచి చిందించే ప్రతి రక్తపు బిందువులోనుంచీ పుట్టబోయే కోటానకోట్ల అల్లూరు సీతారామరాజుల కత్తి దెబ్బలకు నీవ్వూ కాచుకో! కాల్చురా నీతిలేని తెల్లజాతి కుక్కా! కాల్చు! యిదేరా తెనుగుబిడ్డ గుండె! ఇదేరా, అల్లూరు సీతారామరాజు గుండె! కాల్చు! గుండెధైర్యంతో కాల్చు! ఈ అగ్నిపర్వతం యిప్పుడే యిక్కడే పగుల్తుంది! నిన్ను, నీ సైన్యాన్ని, నీ బ్రిటిష్ సామ్రాజ్యాన్ని సమూలంగా సర్వనాశనం చేస్తుంది!

రూ:- ఏయ్! స్కౌండ్రల్!

(రూథర్ మండిపడుతూ సీతారామరాజు గుండెమీద రెండు మూడు పర్యాయములు కాలుస్తాడు.)

రూథ:- హ్హా! హ్హా! హ్హా! (అట్టహాసం చేస్తూ) సీతారామరాజూ! యీపాటికీ యువర్ హైనెస్ వైకుంఠానికీ నేరుగా ట్రేవిల్ చేసి పోతూవుంది!

(సిపాయిలు వదలిపెడ్తారు. క్రిందకు కూలిపోబోతున్న సీతారామరాజును మెల్లగా రామచంద్రరావు మోనుకు ఆనించి పరుండబెడ్తాడు. రామచంద్రరావు మెల్లగా దగ్గరనే మోకాళ్ళమీద కూర్చుంటాడు.)

రామచంద్రరావ్! మీ భారతీయవీరుడు, పెద్ద అల్లూరిసీతారామరాజు, తన బలాన్ని దేశభక్తినియిప్పుడు మట్టిమీద ప్రదర్శనం చేస్తూవున్నాడు! పెద్ద విప్లవ నాయకుడు! గొప్ప గొప్ప దేశభక్తుడు! హ్హా! హ్హా! హ్హా! మా మిలటరీఫోర్స్‌తో మీ దేశంలోని బిగ్గెష్ట్ రివల్యూషన్స్ నన్నింటినీ స్మేష్ చేసేం! మా దేశంలోకూడా యీ హీరో పేరువింటే టెర్రర్! మిల్ట్రీకూడా నిద్రబోదు. యిప్పుడు అంత పెద్ద వీరుడ్ని యీ రూథర్ (నవ్వుతూ) స్మేష్ చేసేడు, స్మేష్! మీ విప్లవ తెలుగునాయకుడ్ని మట్టిలో కలిపివేశాను. యింకాన మేము మీ దేశాన్ని యింకా ఒక్క వెయ్యి సంవత్సరములు యే భయమూ లేకుండా హాయిగా రాజ్యము చేయవచ్చు! ధైర్యమైన దేశభక్తులంతా చచ్చిపోయేరు! ఊత్తఊత్త వుపన్యాసముల నిచ్చే నీబోటి దేశభక్తులుమాత్రం మిగిలివున్నారు! మీ వల్ల మాకు యేట్టి అపాయంలేదు. ఇంకా మేము చాలా హాయిగా యింగ్లాండు వెళ్లిపోతాము! మీ విప్లవవీరుడు అల్లూరు సీతారామరాజును చంపినందుకు మాకు మా దేశంలో మా దయకలిగిన ప్రభుత్వం పెద్దపెద్ద హోదాలు కలిగిన అధికారాలు యిస్తుంది!

(ఒకవైపుకు తిరిగి) ప్లే ఆన్! ప్లే ఆన్ అవర్ మ్యూజిక్! రైజ్ అవర్ ఫ్లేగ్! కమేండర్స్! డ్రింక్! డ్యాన్స్! బీట్ యువర్ డ్రంస్! గోఆన్! (మిలటరీ బిగిల్ శబ్దం విన్పిస్తుంది, ఒక తెల్లసిపాయి బ్రిటిష్‌ప్రభుత్వ జండాను రంగస్థలంమీదకు తీసుకవస్తాడు. లోపల

మిలటరీబ్యాండు విన్పిస్తుంది. రూథర్, మిగతా సైనికులు సెల్యూట్ చేస్తారు.)

రామ:- (జండావైపు చూస్తూ, ఆవేశంతో పైకిలేచి పండ్లుకొరుకుతూ!) రూథర్! అవినీతికి, అహంకారానికి ప్రతిచిహ్నమైన... ఆ...నీ బ్రిటిష్‌రక్తదాహపు జండా యీ దేశంలో యిక అట్టేకాలం ఎగురలేదు! రాక్షసుడా! నీ పతనం సమీపించినది!

రూథ:- పటప్! (రెండుచెంపలను తన చేతితో కొట్తాడు.) సీ మై హ్యాండ్! టేక్ కేర్!

రామ:- నీ రాచకీయ ధర్మనీతి అతిత్వరలోనే ప్రపంచంలో నవ్వుబాట్లౌతుంది.

రూథ:- ముందర నీ బ్రతుకును చూచుకో!

రామ:- నన్నూ కాల్చురా! ముందుతరంలో నామీద రానున్న అపవాదైనా కొంతవరకు మాసిపోతుంది! నీవు ఎంతమందిని కాల్చినా, అంతమందిలో వుండే దేశభక్తిని మాత్రం కాల్చలేవు!

రూ:- స్వాతంత్ర్యం మీకూ వుండాకూడాదు! మీకూఅంతా పెద్దా నాగరికతా లేదు. లేదు. లేదు.

రామ:- నీకు నాగరికత వుండబట్టే దగాచేసి, మా సీతారామరాజును ఖూనీచేసేవ్! రాజీయని చెప్పి మిలటరీసిబ్బందితో మా రాజును పట్టుకున్నావ్! యిదేనా నీ నాగరికత?

రూ.- హ్హో నీవుకూడా యిప్పుడు యింకోక పెద్ద సీటారామరాజువై పోతున్నావ్! వీరుడు. మీ సీటారామరాజు

వైకుంఠంలో వున్నాడు. వారికి లోటుగా నీవు ప్రక్కనే వుండే యమలోకంలో వుంటావు. యీ దేశం మాది! ఆయన లోకం మీది! అక్కడికిపో బ్లడీ డాగ్!

(రూథర్ రామచంద్రరావును గుండెమీద కాల్చబోతాడు. అది తప్పి రామచంద్రరావు నొసటమీద తగుల్తుంది. రూథర్, సిపాయిలు కలసి వెళ్లిపోబోతారు. ఇంతలో లోపల గుఱ్ఱపు డెక్కల శబ్దం, భీభత్సంగా అరుపులువినిపిస్తవి. రామచంద్రరావు రాజువద్ద బాధతో కూలిపోతాడు.)

లోన:- ఏమిటా పిడుగులశబ్దం. వస్తున్నా నాయనా! వస్తున్నా!

రూ:- (లోపల కేకలు విని) ఓ మైగాడ్! మన్యంలోని వీరులు వస్తున్నట్లున్నది. బి కేర్ ఫుల్! రెడీ విత్ రైఫిల్స్! డిస్పర్స్! క్విక్ డిస్పర్స్! యూ దట్ సైడ్! కమాన్! యూ దిస్ సైడ్! (సిపాయిలు ప్రక్కకు వెళ్లి పొదలచాటున దాగుకొంటారు. రూథర్ కు అడ్డముగా నారాయణమ్మ వస్తుంది.)

తల్లి:- ఆగు! పాపీ! ఆగు! ఒక్క తెనుగుబిడ్డ బ్రతికివున్నంత వరకూ మీ ప్రాణాలు మీకు దక్కవు. రాణీయని తెనుగు దేశానికి నచ్చచెప్పి, భారతీయులకండ్లల్లో దుమ్ముకొట్టి, నా బిడ్డను పొట్టబెట్టుకున్నావంటరా, ఛండాలుడా! మా సీతారామరాజు పేరు వింటేనే నీ బ్రిటిష్ సామ్రాజ్యపు గుండెలు దద్దరిల్లేవే! ఏనాడైనా మీ బ్రిటిష్ సిబ్బంది మా సీతారామరాజు కండ్ల ఎదుటకు వచ్చిందా! ఏ తెల్ల సిపాయి అయినా నా బిడ్డపేరు విని రాత్రులు నిద్రపోయేవాడా! దుర్మార్గుడా! నీ గుండెల్లో వేడినెత్తురే వుంటే, నా బిడ్డతో ముఖాముఖిన యుద్ధం జరిపివుండేవా! నా బిడ్డను యుద్ధానికి

మిలటరీబ్యాండు విన్పిస్తుంది. రూథర్, మిగతా సైనికులు సెల్యూట్ చేస్తారు.)

రామ:- (జండావైపు చూస్తూ, ఆవేశంతో పైకిలేచి పండ్లుకొరుకుతూ!) రూథర్! అవినీతికి, అహంకారానికి ప్రతిచిహ్నమైన... ఆ...నీ బ్రిటిష్‌రక్తదాహపు జండా యీ దేశంలో యిక అట్టేకాలం ఎగురలేదు! రాక్షసుడా! నీ పతనం సమీపించినది!

రూథ:- షటప్! (రెండుచెంపలను తన చేతితో కొట్టాడు.) సీ మై హ్యాండ్! టేక్ కేర్!

రామ:- నీ రాచకీయ ధర్మనీతి అతిత్వరలోనే ప్రపంచంలో నవ్వుబాట్లౌతుంది.

రూథ:- ముందర నీ బ్రతుకును చూచుకో!

రామ:- నన్నూ కాల్చరా! ముందుతరంలో నామీాద రానున్న అపవాదైనా కొంతవరకు మాసిపోతుంది! నీవు ఎంతమందిని కాల్చినా, అంతమందిలో వుండే దేశభక్తిని మాత్రం కాల్చలేవు!

రూ:- స్వాతంత్ర్యం మీాకూ వుండాకూడాదు! మీాకూఅంతా పెద్దా నాగరికతా లేదు. లేదు. లేదు.

రామ:- నీకు నాగరికత వుండబట్టే దగాచేసి, మా సీతారామ రాజును ఖూనీచేసేవ్! రాజీయని చెప్పి మిలటరీసిబ్బందితో మా రాజును పట్టుకున్నావ్! యిదేనా నీ నాగరికత?

రూ.- హ్హో నీవుకూడా యిప్పుడు యింకోక పెద్ద సీటారామ రాజువై పోతున్నావ్! వీరుడు మీా సీటారామరాజు

వైకుంఠంలో వున్నాడు. వారికితోడుగా నీవు ప్రక్కనే వుండే యమలోకంలోవుండు. యీదేశం మాది! ఆయమ లోకం మీది! అక్కడికిపో బ్లడీ రోగ్!

(రూథర్ రామచంద్రరావును గుండెమీద కాల్చబోతాడు. అది తప్పి రామచంద్రరావు నొసటమీద తగుల్తుంది. రూథర్, సిపాయిలు కలసి వెళ్లిపోబోతారు. ఇంతలో లోపల గుఱ్ఱపుడెక్కలశబ్దం, భీభత్సంగా అరుపులువిన్పిస్తవి. రామచంద్రరావు రాజువద్ద బాధతో కూలిపోతాడు.)

లోన:- ఏమిటా పిడుగులశబ్దం. వస్తున్నా నాయనా! వస్తున్నా!

రూ:- (లోపల కేకలు విని) ఓమైగాడ్! మన్యంలోని వీరులు వస్తున్నట్లున్నది. బి కేర్ ఫుల్! రెడీ విత్ రైఫిల్స్! డిస్పర్స్! క్విక్ డిస్పర్స్! యూ దట్ సైడ్! కమాన్! యూ దిస్ సైడ్! (సిపాయిలు ప్రక్కకువెళ్లి పొదలచాటున దాగుకొంటారు. రూథర్ కు అడ్డముగా నారాయణమ్మ వస్తుంది.)

తల్లి:- ఆగు! పాపీ! ఆగు! ఒక్క తెనుగుబిడ్డ బ్రతికివున్నంతవరకూ మీ ప్రాణాలు మీకు దక్కవు. రాజీయని తెనుగుదేశానికి వచ్చిచెప్పి, భారతీయులకండ్లల్లో దుమ్ముకొట్టి, నా బిడ్డను పొట్టబెట్టుకున్నావంటరా, ఛండాలుడా! మా సీతారామరాజుపేరు వింటేనే నీ బ్రిటిష్‌సామ్రాజ్యపు గుండెలు దద్దరిల్లేవే! ఏనాడైనా మీ బ్రిటిష్‌సిబ్బంది మా సీతారామరాజు కండ్లఎదుటకు వచ్చిందా! యే తెల్లసిపాయి అయినా నా బిడ్డపేరు విని రాత్రులు నిద్రపోయేడా! దుర్మార్గుడా! నీ గుండెల్లో వేడినెత్తురేవుంటే, నా బిడ్డతో ముఖాముఖిన యుద్ధం జరిపివుండవా! నా బిడ్డకు యుద్ధానికి

అవకాశమిచ్చి రాజీయని కుట్రబన్నకపోతే, మా సీతా రామరాజు ఆంధ్రరక్తమంటే, భారతీయుని గుండెధైర్య మంటే యేమిటో మీగుండెలు అదిరేట్లు మీకు చూపి వుండేవాడు. అది నీచేతకాదు. ప్రచండభాస్కరుని చూచే టంత శక్తి నీకండ్లకు లేదు. లేదురా, లేదు!

రూ:- కరెక్ట్! యూఆర్ కరెక్ట్! మీకుమాత్రం మా యూని యన్ జాక్ చూచేదానికి మాంచి కండ్లున్నవి. మీకు ఆశక్తి వుంది. మీరు మా జండాను శాశ్వితముగా చూస్తూనేవుండాలి!

తల్లి:- ఛీ! యింక మీ రక్టేకాలం వుండలేరురా! అదిగో! ఆ ఎగిరే మీ నీతిలేని తెల్లజాతి విధ్వంసక జండా! ఇక అట్టేకాలం వుండలేరురా! (క్రిందనున్న మట్టిని రెండు పిడికిళ్లు తీసి (క్రిందకు వదల్తూ) నాశనమైపోతారు! మా సీతారామ రాజు బిగించిన పిడికిలితో రానున్నతరం నీ గుండెల్ని పగులగొడ్తుంది. మీ దురహంకార సింహాసనాన్ని నడి సముద్రంలో ముంచిపారేస్తుంది. ఈనాడు మీరు ఒక్క సీతారామరాజుని చంపినారని గర్వపడొద్దురూ! భవి ష్యత్తులో లక్షోపలక్షల అల్లూరి సీతారామరాజులు మిమ్ములను తరిమి,తరిమి నామరూపాల్లేకుండా సర్వనాశనం చేస్తారనే సంగతి నిద్రబోతూ కలలోకూడా మరచిపోవద్దు. నిలవరా పిటికిపందా! నిలువ్! (ప్రక్కనున్న బాణమును తీసు కొని రూథర్ మీదకు పోబోతుంది.)

రూ:- ఇండియన్ లేడీస్ ఆర్ హీరాయిక్ జంస్!

(రూథర్, తెల్లసిపాయి, జండాతోకూడా వెళ్ళిపోతారు. నారాయణమ్మ అటుచూడగా వాళ్ళు కన్పించరు. బాణమును క్రింద వేస్తుంది.)

తల్లి:– గుండెల్లో వేడిలేని పిఱికిజాతి!

(నారాయణమ్మ సీతారామరాజువద్దకు వస్తుంది. సీతారామరాజు తలను తన ఒడిమీద వుంచుతుంది. రామచంద్రరావు మెల్లగా బాధతో నేరస్థునిలా నిలబడును.)

రామ:– అమ్మా! నా అజ్ఞానంచేత తెనుగుప్రజల హృదయ మందిరాల్లో ఒక పవిత్రమైనస్థానాన్ని సంపాదించుకొన్న యీ మహావీరుడ్ని బలిచేసేను. ఈ మహాపరాధానికి భవిష్యత్ తెనుగుప్రజ నన్ను క్షమిస్తుందో, క్షమించదో నాకు తెలియదు.

తల్లి:– ఇందులో నీతప్పేముంది నాయనా!

రామ:– స్వాతంత్ర్యవీరులని, అహింసామూర్తులని చెప్పుకొను చున్న మా కాంగ్రెసువాదులు స్వతంత్ర్య పోరాటమంటే ఏమిటో తెలియక వాదులాడుకుంటున్నసమయంలో పిడుగులా మహాసభలో ప్రత్యక్షమై "మహాప్రజల గుండె బలంతో, భారతీయుల రక్తార్చనతో స్వాతంత్ర్యం సంపాదిస్తాం. వేదికలమీద వుపన్యాసాలు స్వరాజ్యాన్ని సంపాదించలేవు" అని ప్రబోధంచేసి మాకళ్ళు తెరపించిన సీతారామరాజు విప్లవసందేశం వినే భాగ్యం యింక మాకు లేదు! బానిసగాపుట్టి ప్రతిదినము చచ్చేదానికన్నా, ఒక్కదినమేచచ్చి, ఒక్క మహావిప్లవజ్యోతిలా పుట్టమని సందేశ మందించిన సీతారామరాజు అజేయ నాయకత్వం యింక మాకు లేదమ్మా, యింక మాకులేదు.

తల్లి:— ఔను నాయనా!

రామ:— అమ్మా! అమ్మా! క్షమించమ్మా! నాకీ కుట్ర తెలియదమ్మా! అహింసావాదినై మన్యానికే మణిపూసయైన అల్లూరి సీతారామరాజును బలిచేసేనమ్మా! మహావీరుడు నామూలంగా నేలకొరిగి పోతున్నాడమ్మా! మహావీరుడు నామూలంగా నేలకొరిగి పోతున్నాడు.

తల్లి:— తెలిసిచేసిందిందులో నీదేమీ లేదు! నీవూ మోస పోయేవ్!

సీతా:— అమ్మా!

తల్లి:— నాయనా!

సీతా:— అమ్మా!

తల్లి:— నాయనా!

సీతా:— అమ్మా!

తల్లి:— నాయనా! ఎంత అన్యాయం జరిగింది నాయనా! క్షణకాలక్రితం భారతమాత బంధాలు వీడిపోవాలని, వీడి పోయినదినం పర్వదినమని మురిసిపోయేవే! భారతమాత దాస్యవిముక్తి కాకమునుపే కన్ను మూసేవా నాయనా! భగవంతుడా! నా బిడ్డ కెంత అన్యాయం చేసేవు స్వామీ!

సీతా:—(కొనవూపిరితో మాట్లాడుతాడు) అమ్మా! నాకు అన్యాయం జరిగిందని బాధ లేదమ్మా! కానీ, మన భారతమాతకు యే అన్యాయం జరుగుతుందనేదే నా బాధమ్మా! నా అఖండ సర్వమంగళ భారతమాత దాస్యబంధాలు యిక

అట్టేకాలం వుండకూడదమ్మా! అదేనమ్మా నాకోరిక! తల్లీ! భారతమాతా! నా ధర్మాన్ని నెరవేర్చేను. నీ భవిష్యత్తును తలచుకుంటేనే యీ మరణబాధకన్నా యింకా భయంకరంగా వుందమ్మా! అమ్మా! నమస్కారమమ్మా! అమ్మ! అమ్మ! ఈవీరుడి మృతకళేబరాన్ని ఆ ముష్కరజాతి తాకకుండా యీనీ బిడ్డశవంమీద అంత మన్ను చల్లమ్మా! అమ్మా! అమ్మా!

తల్లి:– నాయనా! (ఏడుస్తుంది.)

సీతా:– అమ్మా! అమ్మా! వీరుని తల్లి విలపించరాదమ్మా! అమ్మా స్వరా...జ్యం...

(సీతారామరాజు ప్రాణాలు విడుస్తాడు. రామచంద్రరావు ఒక ప్రక్క నిలబడి వుంటాడు.)

తల్లి:– నాయనా! నేలకొరగినావా! ఆనాడు రక్తాన్ని బొట్టు పెట్టేను. యీనాడు మన్ను పెట్టున్నాను. నీకూ నాకూగల సంబంధం నేటితో తెగిపోయిందా! నాయనా! యింక మాకు లేవా! నాయనా! 'రాజూ!, రాజూ!, రాజూ!' అంటూ విలపించే కోటానకోట్ల భారతీయులకు నీతల్లి చెప్పవలసిన జవాబేమిటి నాయనా? చెప్పు! నాకు చెప్పు! స్వరాజ్యంకోసం రక్తాన్ని క్రుమ్మరించే వీరకిశోరాలకు ఏమని చెప్పేది? స్వరాజ్యం వచ్చిందాకా యీ నెత్తురు మడుగు ఆరిపోకుండా రక్తాన్ని యిక్కడే క్రుమ్మరించమంటావా? నాయనా! చెప్పు! స్వరాజ్యం... (అనంటూ కూలి......ప్రక్కనే కూలిపోతుంది.)

రామ:- ధ్రువతార రాలింది. సర్వత్రా అంధకారం చిమ్మింది. దేశమంతా కన్నీటితో మునిగిపోయింది. నాయకుడు పోయేడు. నడిపించేవాండ్లు గతించేరు. అర్థంకాని వాదాలకు నాయకులు బలి ఐపోతున్నారు. ఇంకా ఎంతమంది బలికావాలో! రాజీలకు మోసపోవద్దు. రాజ్యాలు రాజీలతో రావు. రక్తం చిందించే రణభూమిలో వస్తవి.

ఈ తల్లిని చూడండి! మహావీరునిగన్న తల్లిని చూడండి. అస్తమించనున్న మాతృమూర్తిని చూడండి! కన్నబిడ్డ పోయేడని కాదు, తెనుగువీరుడు కన్నుమూసేడని కాదు, భారతీయుడు భూమిమీద ఒరిగేడని కాదు, కానీ దేశానికి స్వాతంత్ర్యం తెచ్చే ఒక మహాయోధుడు నిర్దయగా అమానుషంగా బలియైపోయేడని గుండెలుపగిలి, భూదేవిగుండెల్లో యేవిధంగా తలదాచుకుందో చూడండి! ఆమె ఏడ్చినఏడ్పుకు అర్థంలేదా! ఆమె కార్చేకన్నీటికి విలువేలేదా?

ఈ వీరుడ్ని చూడండి! (రక్తపుమడుగులో రెండుచేతులను తడిపి ప్రజలకు చూపెడుతూ) ఈ రక్తాన్ని చూడండి. ఈ కవోష్ణ రక్తాన్ని చూడండి. రక్తంపరచిన మడుగులో ఏవిధంగా కూలిపోతున్నాడో! ఆగాయం చూడండి! యింకా రక్తం చిందిస్తూనేవుంది. చనిపోయికూడా ఆ మహాయోధుడు భారతమాతపాదాలకు తన గుండెరక్తంతో అభిషేకం చేస్తూనే వున్నాడు. ఆ మహావీరునికి మనంచూపే శ్రద్ధాంజలి ఏమిటి? వీరుడ్నిచంపిన ఆ హంతకునికి శిక్ష యేమిటి? ఈ పట్టపగటి

ఘోరహత్యకు ప్రతీకారం ఏమిటి? తెల్లజాతి హంతకులు మన వీరుల్ని హత్యచేస్తూ వుండాల్సిందేనా? ఆవీరుల్ని హత్యచేసిన హంతకుల్ని వదలిపెడ్తూవుండాల్సిందేనా? ఇదేనా మన చరిత్రయొక్క విధానం! ఇదేనా మన తరతరాల సాంప్రదాయం! ఇదేనా మన భారతీయుల గుండెధైర్యం! హంతకుల హతమార్చేవీరులు మీలో లేరా! మహావీరుని మరణానికి క్రుంగి గుండెలుపగిలి కన్నీరుకార్చే హృదయాలు మీలో లేవా? (శూన్యంలో చూస్తూ)

అదిగో! అదిగో! వీరుడుచూపించిన మార్గం! కత్తులూ కటార్లు పట్టండి! బాకులూ బల్లెములూ పట్టండి. ఉప్పొంగిన సముద్రంలా లేవండి! హాహాకారాలతో పైపైకి దుమకండి! ఒక్క రూథర్ నేగాదు, ప్రతి తెల్లజాతి కిరాతకుడ్ని పట్టండి. దగ్ధంచేయండి. దగ్ధంకాగా శేషించిన ఆ శత్రుమూక బూడిదతో యీ మహావీరుని గుండెగాయాలను పూడ్చండి. యుద్ధాన్ని ఆపకుండా స్వరాజ్యం వచ్చిందాకా సాగించండి! స్వరాజ్యం సంపాదించి సీతారామరాజుపేరు నిలబెట్టండి! అల్లూరి సీతారామరాజుపేరు నిలబెట్టండి!!!

రామ:– జై! అల్లూరి సీతారామరాజుకి

లోన:– జై

రామ:– జై! ప్రజావిప్లవానికి

లోన:– జై!

రామ:– జై! భారతమాతాకి

లోన:– జై!

రామ:– జై! అల్లూరి సీతారామరాజుకి

లోన:– జై!

[రంగస్థలమంతా చిమ్మచీకటి.]

బరువుగా తెర వాల్తుంది.